# శ్రీ బాలకృష్ణశతకము.



రాజమహేంద్రవరమున రాజకీయబోధనాభ్యసన
కళాశాలయందుపాధ్యాయుఁడగు
భ. పట్టాభిరామయ్య ఎం. ఏ., ఎల్. టి.,
విద్యాభూషణ, సాహిత్యసరస్వతిగారిచే
రచితము.




రాజమంద్రి
శ్రీ సత్యానంద ప్రెస్ నందు
ముద్రింపఁబడినది.

1933

# భగవత్ప్రార్థన.



—: గణపతి :—

కం. శ్రీకంఠుననుఁగుఁ బుత్త్రునిఁ
ప్రాకటముగ విఘ్నములనుఁ ♦ బాపెడినేతన్
నాకేశవందితుని ము
ల్లోకంబులవేల్పుమనము ♦ లో భజియింతున్.

—: సరస్వతి :—

కం. పలుకులవెలఁదిని వాణిని,
నలుమొగములవేల్పురాణి ♦ నలినాక్షినినేఁ
బలుతెలుఁగుల నుతియించెద
నిలుకడతోనాదుజిహ్వ ♦ నివసించుటకై. ౨

—: శివుఁడు :—

కం. ఫాలాక్షుఁ బార్వతీశుని
హాలాహలభోక్త ♦ శర్వుహరునీశానుం
గాలాహిభూషణుని, శివు
శూలినినేఁగొల్తుఁ గరుణఁ ♦ జూపుటకొఱకై. 3

—: పార్వతి :—

కం. హిమశైలేంద్రదనూజను
హిమధామోత్తంసురాణి ♦ హిమధవళాంగిన్

హిమధామసన్నిభాస్యను
నుమనేనెప్పుడుఁదలంతు ♦ నుల్లమునందున్.

—: విష్ణువు :—

కం. నగధరుఁగోదండధరున్
ఖగవాహనుఁ గృష్ణు విష్ణుఁ గమలనాభున్
జగదీశుని శౌరిని, ప
న్నగశాయిని నేభజియింతు ♦ నధికప్రీతిన్. ౫

—: లక్ష్మి :—

కం. క్షీరాబ్ధినుద్భవించిన
నారాయణుదేవిలచ్చి ♦ నలినాస్యనునే
నారాధించిభజించెద
నారోగ్యమునిడుతమాకు ♦ నైశ్వర్యంబున్. ౬

## అనుదినపఠనీయ హరినామావళి.



కం. ఆదిత్యకోటితేజా,
నాదాత్మక, భక్తపోష, ♦ నరమృగరాజా,
వేదనుత, నాభికంజా,
ఛేదితదితివంశరాజ, ♦ శ్రితసురభూజా. ౧

కం. సోమావతంసమిత్రా,
సోమకరిపు, నీలమేఘ ♦ సుందరగాత్రా,
సోమాబ్జమిత్రనేత్రా,
సామజరాజేంద్రవరద, ♦ శౌరె, పవిత్రా. ౨

కం. మంగళతరగుణధామా
సంగరహిత, యదుకులేంద్ర ♦ సరసిజదామా,
రంగేశ, పుణ్యనామా,
అంగజరిపుచాపభంగ ♦ హాలిశ్రీకామా. ౩

కం. బుధనుత, సుపరిపాలా,
విధినందిత, మునిశరణ్యా, ♦ వినుతసుశీలా,
అధికకరుణాలవాలా,
మధుసూదన, కైటభారి, ♦ మధురాబాలా. ౪

కం. గురుతరసుగుణకలాపా,
కురునాశక, పాండుమిత్ర ♦ గోకులగోపా,
వరదా, ఛిదశివచాపా,
వరరవికులసుప్రదీప, ♦ వారితపాపా. ౫

కం. శుక్రాక్షభంగ, శ్రీశ, త్రి
విక్రమ, కమలాక్ష, శౌరి, ♦ విమలశుభాంగా,
చక్రి, కరుణాంతరంగా,
నక్రాంతక, నాగతల్ప, ♦ నగధర, రంగా. ౬

కం. శనిచరదోషనివారా,
అనిమిషవందిత, మురారి, ♦ హరి, మణిహారా,
ఘననీల, కృపాపారా,
కనకాంగద కుండలధర, ♦ కలుషవిదూరా. ౭

# శ్రీరంగనాయక స్తవము.

నాట.

సీ. శ్రీరంగనాయకా ♦ క్షీరాబ్ధిఁ దేలుచు
శేషుఁడు మెత్తని ♦ సెజ్జగాఁగ।
శంఖగదాపద్మ ♦ చక్రంబులును నీదు
నాల్గుచేతులయందుఁ ♦ గల్గియుండ।
శ్రీదేవి పాదముల్ ♦ చెన్నుగఁ బట్టంగ
నాభిపద్మంబున ♦ నలువపుట్ట।
నీలమేఘశ్యామ ♦ నీచారు వక్షముఁ
గౌస్తుభమణిదివ్య కాంతులొప్ప।

గీ. వేదఘోషలతోఁ గొల్వ ♦ విబుధవరులు।
కీర్తనల్ సేయఁ గిన్నర ♦ కింపురుషులు।
[illegible]ర, ♦ పక్షిగమన,।
రంగనాయక, పట్టాభి ♦ రామపోష॥ ౧

సావేరి.

సీ. పలుగాకులం ద్రుంపఁ ♦ బదిమాఱ్లు భూమిపైఁ
బురుషోత్తమా, నీవు ♦ పుట్టుదయ్య।
మత్స్యమై పుట్టి సో ♦ మకరాక్షసుం జంపి
వేదముల్ గొనితెచ్చి ♦ విధికి నిచ్చి।

దేవాసురుల్ క్షీర ♦ ధిన్ జిలుకంగను
కూర్మమై కవ్వపుఁ ♦ గొండమోసి।
రంగేశ, నీవు వ ♦ రాహమై ధరనెత్తి
రాక్షసేంద్రుని హిర ♦ ణ్యాక్షుఁ దునిమి।
గీ. కంజదళనేత్ర యలహేమ ♦ కశిపుఁజంప।
నారసింహుఁడవైతివి ♦ నాగశయన।
కుబ్జబాలుఁడవై బలిం ♦ గూల్చితీవు।
రంగనాయక, పట్టాభి ♦ రామపోష॥ ౨

శంకరాభరణము.

సీ. పరశురాముండవై ♦ పలుధరణీశులఁ
జెండాడితివికావె ♦ శ్రీనివాస।
శ్రీరాముఁడై పుట్టి ♦ సీతనుచేఁబట్టి
రావణుం జంపితి ♦ రణమునందు।
హాలిసోదరుండవై ♦ యతి క్రూరుఁడై నట్టి
శిశుపాలునిన్ హత్యఁ ♦ జేసితీవు।
ధరణిని బుద్ధావతారంబుఁ దాల్చుచు
బోధకుం డైతివి ♦ బుధవరేణ్య।
గీ. కలుషముల్ చెలరేగెడి ♦ కలియుగమున।
ఖలులఁ జంపుచు శిష్టులఁ ♦ గాచుకొఱకు।
కలికియైవేగఁ బుట్టవె ♦ కమలనేత్ర।
రంగనాయక, పట్టాభి ♦ రామపోష॥ ౩

ధన్యాసి.

సీ. "రంగేశ!" యని యంత ♦ రంగములోనెంచి
తన్మయుండై ప్రజ్ఞ ♦ దప్పువాని।
రంగనాథా, నీదు ♦ రంగగుమూర్తినిఁ
గాంచుచుఁ బాష్పముల్ ♦ గార్చువాని।
రంగ, నీసత్కథా ♦ రసమునుఁ జెవులతోఁ
గ్రోలంగసతతంబుఁ ♦ గోరువాని।
"రంగ, రంగా, రంగ ♦ రంగ రంగా" యని
నోరారనేవేళ నుడువువాని!

గీ. చేతులారరంగ నిన్నుపూ ♦ జించువాని।
శ్రీశ, నిచ్చలునీయండఁ ♦ జేరువానిఁ।
బాపమంటునె ? జన్మంబు ♦ దాయకున్నె ?।
రంగనాయక, పట్టాభి ♦ రామపోష !॥ ౪

పీ లు.

సీ. రంగనాథా, నీదు ♦ రమ్యనామముఁ బల్క
జిహ్వనాకొసఁగుము ♦ శ్రీనివాస।
రంగశాయీ, మెన ♦ రంగ నీసత్కథల్
వినఁగోరు చెవులిమ్ము ♦ వేదవేద్య।
రంగేశ, నీసుంద ♦ రాకృతింజూచెడి
కనులనాకొసఁగుము ♦ కమల నయన।

రంగ, నీపైఁ బువ్వు ♦ రాజి నాఘ్రాణించు
నాసిక నిజమయ్య ♦ నాగశయన।
గీ. శ్రీశ! నీసేవఁ జేసెడి ♦ చేతులిమ్ము।
భక్తవత్సల, నినుఁ జేరు ♦ పదములిమ్ము,।
మాధవా, నిన్ స్మరియించు ♦ మనమునిమ్ము,।
రంగనాయక, పట్టాభి ♦ రామపోష॥ ౫

బే హా గు.

సీ. దుఃఖజీమూతంబుఁ ♦ దొలఁగంగఁ జేయును
మధువైరి నీనామ ♦ మారుతంబు।
అజ్ఞానమనియెడి ♦ యంధకారముఁ దోలు
విష్ణు, నీపేరను ♦ వేవెలుంగు।
భవనీరధిన్ మమ్ముఁ ♦ బారంగతులఁ జేయు
నౌకగాదే నీదు ♦ నామమొండు।
కలుషతృణంబులఁ ♦ గాల్చివేసెడి తీవ్ర
శిఖిగాదె నీపేరు ♦ శ్రీనివాస।
గీ. కామముఖ్యారులం గెల్వఁ ♦ గవచమిదియొ
కర్మబంధంబులం ద్రుంప ♦ ఖడ్గమిదియొ।
కామితార్థములొసఁగు నీ ♦ కల్పతరువు।
రంగనాయక, పట్టాభి ♦ రామపోష॥ ౬

శ్రీ రా గ ము.

సీ. శ్రీరుక్మిణీవర, ♦ శిశుపాల, సంహార,
భాసురమణిహార, ♦ భవవిదూర।

కామితదాయక ♦ కరిరాజ రక్షక
మధురాసురాంతక ♦ మారజనక!
గోకులపరిపాల ♦ గోపవధూలోల
గురుబుధనుతశీల ♦ గోపబాల!
కృతసుర రిపుశిక్ష ♦ కేశవ కమలాక్ష
శ్రీవత్సయుతవక్ష ♦ శ్రీశ, దక్ష!

గీ. నిఖలఖలశోష, హరి, కమ ♦ నీయవేష,!
మానిహృత్తోష, కౌస్తుభ ♦ మణివిభూష,!
తల్పకృత శేష, మాధుర్య ♦ తమసుభాష,!
రంగనాయక, పట్టాభి ♦ రామపోష॥ ౭

సు ర ట.

సీ. శ్రీశ నిన్ ధ్యానించి ♦ చిత్రాసనంబిడి
పాద్యంబు నర్ఘ్యమున్ భక్తినిచ్చి!
యాచమనీయంబు ♦ నభిషేకమునొసంగి
శుభ్రాంబరము, యజ్ఞ ♦ సూత్రమునిడి!
గంధంబలఁది, పూలఁ ♦ గరముతోఁ బూజించి
ధూపదీపంబుల ♦ తోడఁగొల్చి!
వేదవేద్యుండ, నై ♦ వేద్య హారతులిచ్చి
శ్రీపతినినుఁ బ్రద ♦ క్షించి మ్రొక్క!

గీ. నలినదళనేత్ర యీపను ♦ నాఱుగతుల!
నిన్ను సేవించుభాగ్యంబు ♦ నియ్యుమయ్య!

శ్రీబాలకృష్ణ శతకము

చారుతరవేష, సన్ముని ♦ సాధుతోష।
రంగనాయక, పట్టాభి ♦ రామఘోష॥ ౮
అష్టకము సంపూర్ణము.

—: శ్రీ రా ముఁ డు :—

ఉ. శ్రీరఘురామచంద్ర, సర ♦ సీరుహమిత్ర కులాబ్ధిచం[ద్ర, యో
సారసపత్రనేత్ర, ఘన ♦ సన్నిభసుందరనీలగాత్ర, యో
వారిధిబంధనాచతుర, ♦ వారిజలోచనజానకీవరా,
వారితభక్తపాప, ముని ♦ వందిత, మాధవ, మమ్ముఁగావవే.

—: ఆ ం జ నే యుఁ డు :—

ఉ. శ్రీరఘురామపాదసర ♦ సీరుహయుగ్మనివాసభృంగ, యో
వారిధిలంఘనాచతుర, ♦ వాయుతనూజ, కృపాంతరంగ సం
హారితదైత్యబృంద,మణి ♦ హార,సువజ్రనిభాంగ,యాంజనే
యా, రిపుభంగ, బ్రహ్మచర, ♦ ఆశ్రితపోషక, మమ్ముఁ[గావవే.

—: రా మా య ణ సం గ్ర హ ము: —

సీ. దశరథాత్మజుఁడవై ♦ ధరణిని జన్మించి
తాటకరక్కసిం ♦ గీటడంచి।
గాధేయుజన్నంబుఁగాపాడి ♦ మునిసతిన్
రాతికూపమునుండి ♦ నాతిఁజేసి।

శివచాపము ద్రుంచి ♦ సీతను చేఁబట్టి
యబ్బమాటకులొంగి ♦ యడవి కేగి।
మాయలేడిం జంపి ♦ మగువను గోల్పోయి
వానర బలముతో ♦ వనధిదాటి।
గీ. రావణుని యోడ్చి వధియించి ♦ రణమునందు।
వహ్నిలోనుండి చేకొన్న ♦ వనితతోడఁ।
బట్టభద్రుఁడవై తివి ♦ భవ్యనామ।
శోభనాచలధామ ♦ పట్టాభిరామ॥

—: భా గ వ త సం గ్ర హ ము :—

సీ. అశరీరవాణి ము ♦ న్ననినట్లు దేవకీ
యష్టమగర్భంబు ♦ నవతరించి।
బాలహత్యకుఁగంసుఁ ♦ బంపునవచ్చిన
రాక్షసావళినెల్ల ♦ రయముఁజంపి।
గోపికా ప్రియుఁడవై ♦ గోవర్ధనమునెత్తి
కాళీయునణఁచి యా ♦ కంసుఁద్రుంచి।
శిశుపాలునోడించి ♦ చేఁబట్టి రుక్మిణిన్
భూసురున్ దారిద్ర్య ♦ దూరుఁజేసి।
గీ. మానభంగముఁదప్పించి ♦ మానవతికి।
పార్థసారథివై కూల్చి ♦ పాండురిపుల।
తత్వముంజెప్పితివి చారు ♦ తరసుభాష।
రమ్యగుణభూష పట్టాభి ♦ రామపోష॥

-: చ క్ర ము :-

సీ. పాహిపాహియటంచు ♦ బలహీనగజమనఁ
జక్రంబుచేఁజచ్చె ♦ నక్రవరము।
దుష్టుఁడౌకంసునిఁ ♦ దునుమాడువేళలో
ఖండించెఁజక్రంబు ♦ ఖలునిశిరము।
అంబరీషునిపైని ♦ యాగ్రహించినమునిన్
మంటలచక్రంబు ♦ వెంటఁదరిమె।
నరకాసురునితోడ ♦ నారినీవుంబోరఁ
జక్రంబు వానిని ♦ సంహరించె।
గీ. ఖలుల శిక్షించితివియనఁ ♦ గల్లయగునె ?।
భక్తవత్సలుఁడౌటయ ♦ బద్ధమగునె ?।
సహ్యమాయెనె యిప్పటి సాధుహింస ?।
చక్రమెటదాఁచినావయ్య ♦ చక్రపాణి ?॥

—: సర్వేశుని బహువిధవ్యక్తులు-తీర్థయాత్రలు :—

సీ స మా లి క.

శ్రీవిష్ణువని జనుల్ ♦ సేవించువాఁడీవె
శివుఁడవీవే, విరిం ♦ చియును నీవె।
విఘ్నవారణనేత ♦ విఘ్నేశుఁడవు నీవె
పలుకులవెలఁదియూ ♦ వాణివీవె।
సిరుల భక్తులకిడు ♦ శ్రీదేవియును నీవె
భుక్తిదాయిక యన్న ♦ పూర్ణవీవె।

కంచిలోఁ బృథ్విగాఁ ♦ గన్పడువాఁ డీవె
జంబుకేశుండను ♦ జలమునీవె।
శ్రీశైలతేజ సం ♦ కాశమూర్తియు నీవె
కాళహస్తీశుఁడన్ ♦ గాలినీవె।
ఆకాశమాచు ర ♦ హస్యంబనెడి పేరఁ
బరఁగెడి శ్రీచిదంబరుఁడ వీవె।
కాలభైరవ, జంతు ♦ జాలంబునందెల్ల
నుండెడి విశ్వేశ్వ ♦ రుండనీవె।
అఱయ భేదములేదు ♦ హరకేశవులకని
బోధించు రామేశ ♦ నాథుఁ డీవె।
సూర్యనారాయణా ! ♦ సోమశేఖరుఁ డీవె,
మినుసిగదయ్యమున్ ♦ మేటినీవె।
వీరరాఘవుఁడను వైజ్ఞసైతమునీవె,
పరిమళశ్రీరంగ ♦ పతియునీవె।
కలుషాపహారి వేం ♦ కటశైలపతినీవె
వరదుఁడౌ శ్రీకాంచి ♦ వరదుఁ డీవె।
నిరసింపఁ గూడదు ♦ నిమ్నజాతులనని
బోధఁజేసెడి జగ ♦ న్నాథుఁ డీవె।
భక్తసులభుఁడైన ♦ పండరీశుఁడవీవె,
గానకృష్ణుఁడవీవె ♦ దీనపోష !

గీ. బహువిధవ్యక్తుఁడవు నీదు ♦ పాదసేవ।
దివ్యసుక్షేత్రములకెల్లఁ ♦ దిరిగిచేసి।
కోవిదుల యోగివర్యుల ♦ గోష్ఠిఁగూడి।
ధన్యుఁడైనట్టి వానికిఁ ♦ దత్త్వమేల ?॥

# శ్రీ బాలకృష్ణ శతకము.



—: సంబోధన :—

గీ. శ్రీహరీ, రంగనాయక, ♦ శేషతల్ప।
కంజదళనేత్ర, నీలాంగ, ♦ కమలనాభ।
శంఖపద్మ గదాధారి, ♦ చక్రపాణి।
భంజితాఖిల భవకృష్ణ, ♦ బాలకృష్ణ॥ ౧

గీ. శ్రీశ, వటపత్రశాయి, యోచిద్విలాస।
నిర్గుణాత్మక, నిర్మల, నిర్వికార।
సగుణ, సాకార, త్రైలోక్య ♦ సార్వభౌమ।
భంజితాఖిల భవకృష్ణ ♦ బాలకృష్ణ॥ ౨

గీ. అఖిల బ్రహ్మాండనాయక, ♦ ఆదిపురుష।
అమరసేవిత, మునివంద్య, ♦ అసురవైరి।
భవ్యగుణధామ, శౌరి, స ♦ ద్భక్తపాల।
భంజితాఖిల భవకృష్ణ ♦ బాలకృష్ణ॥ 3

సీ. క్షీరసాగరశయన, ప • క్షీంద్రగమన।
బుధజనావన, శ్రీరంగ • పురనివాస।
నిఖిలఖలశోష, అతి క్షమ • నీయవేష।
భంజితాఖిల భవతృష్ణ • బాలకృష్ణ॥ ౪

సీ. యోగనిద్రిత, శ్రితజన • యోగివినుత।
నిగమగోచర, శ్రీకృష్ణ • విగతపాప।
భక్తవత్సల, సురనత • పాదయుగళ।
భంజితాఖిల భవతృష్ణ • బాలకృష్ణ॥ ౫

—: అ వ తా ర ము లు :—

సీ. ధర్మమడుగంటి, పాపము • ధరణి నిండ।
బాపులంగూల్చి ధర్మముం • బ్రబలఁజేయ।
నవతరింతువుగావె యీ • యవనియందు।
భంజితాఖిల భవతృష్ణ • బాలకృష్ణ॥ ౬

సీ. మొట్టమొదటను ధర నీట • మునిఁగి యుండ।
నాదిజీవులు జలచరు • లంచుఁ జూప।
మత్స్యమై శ్రుతి-చోరు సో • మకునిఁ జంపి।
బ్రహ్మకిడితివి వేదముల్ • బాలకృష్ణ॥ ౭

సీ. పుట్టుటకుమున్ను ధరణిలో భూచరాళి।
ప్రాణు లిలమీద జలమునం • బరఁగెననఁగ।
మంధరముమోయలేదె కూ • ర్మావతార ?
భంజితాఖిల భవతృష్ణ • బాలకృష్ణ॥ ౮

—: దశావతారములు :—

గీ. పక్షివాహన, యలహిర ♦ ణ్యాక్షుఁ జంపఁ।
బందివైతివి, యిలఁ జతు ♦ ష్పాత్త్రలంతఁ।
బుట్టఁ దొడఁగెనటంచును ♦ బోధఁ జేయ।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౯

గీ. బాలభక్తుఁడు ప్రహ్లాదు ♦ బాముఁ దీర్ప।
నారసింహుఁడవైతివి ♦ నాగశయన।
జంతువుంగాక కేవల ♦ జనుఁడుఁగాక।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౧౦

గీ. మనుజునాదినిఁ జూపు వా ♦ మనుఁడుగాను।
కశ్యపాత్మజుఁడై నీవు ♦ కపటవటువు।
బలినిఁ గూల్చితి మూడడు ♦ గులను వేఁడి।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౧౧

గీ. జనులకాదినిఁగలకోప ♦ శక్తిజూప।
బరశురాముండవై యిలఁ ♦ బరఁగితీవు।
క్షాత్త్రమునఁ గూల్చితివి కావె ♦ క్షత్త్రియులను।
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౧౨

గీ. వృద్ధిఁజెందంగ నరులకు ♦ బుద్ధిబలము।
దేహబలమంతయుండుటఁ దెలియఁజేయ।
రావణుంజంపితివినీవు ♦ రామచంద్ర।
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౧౩

గీ. నాగలింబూని భూకృషి ♦ నయముగాను।
సలిపిరని యెఱుఁగందగు ♦ హాలినిఁజూడ।

హాలిసహోదర శిశుపాల ♦ హంత ! శౌరి ! ।
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౧౪

గీ. దేహబలమును మించును ♦ ధీబలంబు।
సాధుగుణములుసత్యమే ♦ సత్తులంచు।
బోధనల్ సేసితివి నీవు ♦ బుద్ధుఁడగుచు।
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౧౫

గీ. మహినిధర్మాత్ములింకను ♦ మనఁగలేరు।
సాధుహింసయదిక్షయ ♦ సాధువులకు।
కలికివై వేగరావయ్య ♦ ఖడ్గధారి।
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౧౬

గీ. శ్రీశ ! పదిరూపములఁ బ్రశం ♦ సించి నన్ను।
ధన్యునింజేయు కృష్ణావ ♦ తారచర్య।
విపులముగ నానదీరంగ ♦ విన్నవింతుఁ।
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౧౭

గీ. ఇటుల నీమూర్తిప్రియతమం ♦ బేలయనిన।
నాదినటువురుచేసిన ♦ యసురహత్య।
దక్కఘనకార్యమున్నదె ♦ యొక్కటైన ? ।
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౧౮

గీ. బలినిఁజంపంగఁ బుట్టి ♦ యావామనుండు।
ఘనునిసత్యవ్రతున్ బహు ♦ కపటవృత్తి।
నణఁచెఁ ; గొనియాడఁ దగునె యీ గుణముదేవ ? ।
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౧౯

గీ. పరమరాజసమూర్తి యా ♦ పరశురాముఁ।
డాగ్రహముఁబూని రాజుల ♦ హత్యఁజేసె।
భయముఁబుట్టించుఁగాని తా ♦ వంద్యుఁడగునె।
భంజితాఖిలభవకృష్ణ ♦ బాలకృష్ణ॥ ౨౦

గీ. దేహబలమొండె కాకను ♦ ధీబలంబు।
సత్యముం దయగల్గిన ♦ సత్యమూర్తి।
కౌసలేయుండువంద్యుఁడు ♦ గాని, తగఁడు।
పాపమయమగు ధరణికి ♦ బాలకృష్ణ॥ ౨౧

గీ. హలిసురాసక్తుఁడగ్రజుఁ ♦ డతనియశము।
రాజిలునెతోడ భవదీయ ♦ తేజముండ ? ।
దివ్వటింబ్రక్క వెల్గెడి ♦ దీపగతిని ? ।
భంజితాఖిలభవకృష్ణ ! ♦ బాలకృష్ణ॥ ౨౨

గీ. బుద్ధమునిబోధలెఱుఁగు ప్ర ♦ బుద్ధులెవరు ? ।
బహుజనులు పామరులుకని ♦ పట్టఁదరమె ? ।
గార్ధభంబున కేలొకో ♦ గంధసుమము ?।
భంజితాఖిలభవకృష్ణ ♦ బాలకృష్ణ॥ ౨3

గీ. కలికిరానున్నవాఁడౌటఁ ♦ గానరెవరు।
అతఁడు వర్ధిలు పాపుల ♦ నణఁచుకొఱకు।
నుగ్రముందోర్బలముఁగల్గి ♦ యుండవలయు
భయదుఁడై యొప్పవలయును ♦ బాలకృష్ణ॥ ౨౪

గీ. అన్నిరసములు నీయందు ♦ నమరియుండు।
నెట్టివారలకుం దగి ♦ నట్టిగుణము।

నీకెగలదయ్య, లోకేశ, ♦ నీలవర్ణ।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౨౫

గీ. అసురులకుహారి, శిష్టుల ♦ కమరతరువు।
గోపికానాథ, గోరక్ష ♦ కుండవీవు।
పాండుమిత్రుండు, సద్గురు ♦ పార్థునకును।
భక్తజన దీనరక్షక ♦ బాలకృష్ణ॥ ౨౬

గీ. ఇట్టివాడవు నీవన ♦ నేరితరము ? ।
శక్యమేనిన్ను వర్ణింపఁ ♦ జక్కఁగాను।
ఫణిపతికినైన, గురునకు ♦ బ్రహ్మకైన।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౨౭

గీ. భారమంతయు నీమీఁదఁ ♦ బడఁగవైచి।
తెలుపఁబూనితినే భవ ♦ దీయమహిమ।
ప్రాభవంబంతయును నీదె ♦ భవ్యచరిత
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౨౮

గీ. భక్తినింబట్టి వచ్చును ♦ పలుకుసొంపు।
హాస్తియును ధ్రువబాల ప్ర ♦ హ్లాదులెల్ల।
షల్కిభజియింతురెట్టుల ♦ భక్తిలేక।
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౨౯

గీ. భక్తియును నిరతంబు ♦ నీపాదసేవ।
భక్తసాంగత్య మనిశము ♦ భజనసుఖము।
నాకొసంగుము వేఱొల్ల ♦ నాగతల్ప।
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ 30

—: అ శ రీ ర వా ణి :—

గీ. కంసుఁడీధరనెల్లర ♦ హింసఁజేయు।
"అసురనాయకనినుఁ గూల్ప ♦ నవనిఁబుట్టి।
యున్నవాఁడయ్యహరి" యని మిన్నువల్కె।
భంజితాఖిలభవకృష్ణ ♦ బాలకృష్ణ॥ 3౧

గీ. ధరణికంపించ, మబ్బుల యుఱుముమాడ్కిఁ।
బల్కెఁగావినిదైత్యుని ♦ బలముపోయె।
పాగరడంగెను, వెలఁబోయె ♦ మొగముచాల।
భంజితాఖిలభవకృష్ణ ♦ బాలకృష్ణ॥ 3౨

గీ. పాపములనుండి భువినిఁ గా ♦ పాడుకొఱకు।
పుణ్యులిలఁబుట్టుతఱి, సర్వ ♦ భూతములిటు।
ప్రకటనల్ సేసి తెలిపించుఁ ♦ బ్రజలకెల్ల।
భంజితాఖిల భవకృష్ణ ♦ బాలకృష్ణ॥ 33

—: మా య :—

గీ. సోదరికి నెనిమిదవకాన్పు ♦ సుతునిఁజంప।
మామయత్నింప, నీచోట ♦ మాయయుండి।
నింగికెగయుచు, పూనిక ♦ భంగపఱచె।
భంజితాఖిల భవకృష్ణ ♦ బాలకృష్ణ॥ 3౪

—: శి శు హం త క వ ధ :—

గీ. గోకులంబుననుండుట • గుఱుతుపట్టి।
శకటతృణపూతనాఖ్యని • శాచరాళి।
కుత్సితులు రాఁగ, వారలఁ • గూల్చితీవు।
భంజితాఖిలభవతృష్ణ • బాలకృష్ణ॥ ౩౫

—: మ న్నుఁ ది ను ట :—

గీ. మన్నుఁ దింటివటంచు నీ • మాత బెగడి।
నోరుఁదెఱచి లోఁజూడ, నీ • నోటిలోన।
నిండి కన్పడె సకల బ్ర • హ్మాండచయము।
భంజితాఖిల భవతృష్ణ • బాలకృష్ణ॥ ౩౬

—: న వ నీ త చో రుఁ డు :—

గీ. వ్రేతకొంపలలోదూరి • వెన్నముద్ద।
లపహరించితివని వార • లాగ్రహమున।
కొండెముల్ సెప్పంగ నీతల్లి • కోపమొందె।
భంజితాఖిల భవతృష్ణ • బాలకృష్ణ॥ ౩౭

గీ. అఖిలలోకాత్ముఁడవు చోరుఁ • డగుటయెట్లు ?।
అన్యులేలేనివాఁ డెట్లు • లపహరించు ?।
తియ్యవాఁడవు, కోరవే • తీపువెన్న ?।
భంజితాఖిల భవతృష్ణ • బాలకృష్ణ॥ ౩౮

—: ఉలూఖబంధనము :—

గీ. చిట్టలుకతో యశోదనిన్ • గట్టుతఱిని।
చిక్కకయె, కొంతతడవీవు • చిక్కువెట్టి।
కట్టువడితివి తుదకీవు • కరుణతోడ।
భంజితాఖిల భవకృష్ణ • బాలకృష్ణ॥ 39

గీ. వింతమీఱంగ ఱోటిని వెన్క • నీడ్చి।
వృక్షయుగళము మధ్య కం • జాక్షనీవు।
ప్రాఁక, నవి శాపముక్తులై • ప్రస్తుతించెఁ।
బ్రాభవమునీది యెట్టిదో • బాలకృష్ణ॥ 40

—: రాక్షసహత్య :—

గీ. రక్కసులఁ జంపితివి నీవు • రణమునందు।
వత్సబకధేనుకులఁగూల్చి • వరుసఁగాను।
వృషభ కేశివ్యోమ హత్యఁ గా • వించితీవు।
భంజితాఖిల భవకృష్ణ • బాలకృష్ణ॥ 41

—: సర్వవ్యాపి :—

గీ. ఇచ్చ టచ్చటనుండువీ • వెందునీవె।
సచ్చిదానంద దాయినీ • సంగముదము।
వేయివేతలకుంగలై • విశ్వమయుఁడ !।
భంజితాఖిల భవకృష్ణ • బాలకృష్ణ॥ 42

గీ. ఆత్మతారకమౌ నీదు ♦ హస్తమౌడ!
నీదు మురళీరవంబిదు ♦ నిండుముదము
ధరణిఁ జెందని కేవల ♦ దైవసుఖము!
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౮౩

గీ. ఫణులు పశువులు నదివిని ♦ యణఁగి యుండు
మంత్రమునఁ గట్టువడినట్లు ♦ వింతయేమి ? ।
ఖలులు పాపులు నీమ్రోల ♦ నిలువఁ గలరె ? ।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౮౪

—: కాళియ మర్దనము :—

గీ. పాము నీదేహముంజుట్టి ♦ పట్టెఁగాని!
చిందులేయుచు నీవంతఁ ♦ జిలువఁ ద్రొక్క।
సన్నపోలుసుల చుట్టలు ♦ సళ్ళైనయ్యె!
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౮౫

గీ. మంచివారిని కీడావ ♦ రించుఁగాని!
ప్రబలుచుండెడి పుణ్యంపు ప్రాభవమునఁ!
గ్రుంగి తుదకిట్లు పాపము ♦ లొంగవలయు!
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౮౬

గీ. కాళియునిఁ ద్రొక్కి నీవు లో ♦ కమునకెపుడుఁ।
బాపమడుగంటు, పుణ్యంబు ♦ ప్రబలుననుచుఁ।

బ్రజలకుం జెల్పితివి గద, ♦ భానుతేజ!
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౪౭

—: గోపికావస్త్రాపహారణము :—

గీ. నీటిలో మెడలోతున ♦ నిలచినారు।
మాటలాడక వివసన ♦ మానవతులు।
వెంగలులు! విలువయేమి ♦ యీ వేసములకు ?।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౪౮

గీ. భక్తవత్సల! భవదీయ ♦ భక్తకోటి।
మానవలయును మానమ ♦ మత్వములను।
భక్తినిర్మల ప్రేమ సూ ♦ పంగవలయు।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౪౯

—: నౌ కా యా న ము :—

గీ. యానముంజేయ నౌకలో ♦ యమునపైని।
గోపికలు నిన్ను విడున, యో ♦ గోపబాల!।
ఘోరవర్షము వారిపైఁ గురిపితీవు।
భంగమొందెను గర్వము ♦ బాలకృష్ణ॥ ౫౦

—: అ ష్ట మ హి ళ లు :—

గీ. కుండినాధీశు భీష్మకుఁ ♦ గూతునిన్ను।
వరునిగానెంచి విప్రుచే ♦ వార్తఁబంపఁ।

బగతురం గెల్చి కన్యఁ జే ♦ పట్టితీవు।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౫౧

గీ. జాంబవంతునితోఁ బోరి ♦ జాంబవతికి।
మగఁడవై, కొంటివయ్య శ ♦ మంతకమణి।
లోకనిందనుఁ దొలఁగింప, ♦ లోకనాథ।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౫౨

గీ. అంత సత్యభామనుఁ బెండిలి ♦ యాడితీవు।
ఆ యమం గూడి ఖలు నర ♦ కాసురేంద్రుఁ।
గూల్చితివి ఘోరరణమున ♦ గోపవర్య।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౫౩

గీ. ఇందుముఖులైదుగురు మిత్ర ♦ వింద, భద్ర।
సవినలోచన లక్షణ, ♦ నాగ్నజిత్తి।
మఱియుఁ గాళింది, యనువారి ♦ మగఁడవగుచుఁ।
బడసితివి యష్టమహిళల ♦ బాలకృష్ణ॥ ౫౪

## —: శత్రు వధ :—

గీ. మొత్తిపరిమార్చి చాణూర ♦ ముష్టికులను।
జంపితివి ఖలుఁ గంసుని ♦ చక్రపాణి॥
ఉగ్రసేనునికిం బట్ట ♦ మొసఁగితీవు।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౫౫

గీ. బాణుఁడను రాక్షసుం డీశ వరముఁబడసి।
నిన్నెదుర్కొని పోరాడ ♦ నిటలనేత్రు।
నోడ్చితివి నీవు రణమున ♦ నోముకుంద !।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౫౬

గీ. రుక్మిణికి నీవు వరుఁడవై ♦ రుక్మిసఖునిఁ।
బరమదుష్టుని యలశిశు ♦ పాలునోడ్చి।
కూల్చితివి తుట్టతుదకీవు ♦ గోపవర్య।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౫౭

గీ. అల్లుఁడగుఁ గంసునిం జంపి ♦ తంచు నిన్ను।
సమరమున నెదుర్కొనె జరా ♦ సంధుఁడంత।
చీల్చి చంపితివాతనిఁ ♦ జివరకీవు।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౫౮

—: కు చే లు డు :—

గీ. బాల్యమున విద్యలో సహ ♦ పాఠియైన।
బ్రాహ్మణుఁడు పేదరికముచే ♦ బాధపడుచు।
వచ్చె నీ దర్శనార్థమై ♦ వనితపంప।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౫౯

గీ. ఏమి తెచ్చితివనఁగ సు ♦ ధాముఁడంత।
పిడికెడటుకులు నీకిచ్చెఁ ♦ బ్రేమమీర।

చేతఁగొని యిచ్చితివిగావె ♦ సిరులుసుఖము?।
భంజితాఖిలభవకృష్ణ ♦ బాలకృష్ణ॥ ౬౦

—: పాండు మిత్రుఁడు :—

గీ. ధర్మ్మలగుఁబాండవులకు న ♦ ధర్మచరులు।
కౌరవులు కుత్సితాత్ములు ♦ వైరులైరి।
పాపులంగూల్చితివి పాండు ♦ పక్షుఁడవగుచు।
భంజితాఖిల భవకృష్ణ ♦ బాలకృష్ణ॥ ౬౧

గీ. ధర్మపత్నినియోాడెను ♦ ధర్మజుండు।
మానభంగము కానుండ ♦ మానవతికి।
వస్త్రశతమిచ్చితివిగావె ♦ వరదయునఁగ।
భంజితాఖిల భవకృష్ణ ♦ బాలకృష్ణ॥ ౬౨

గీ. కృష్ణ! నీయెడఁగౌరవుల్ ♦ కీడుఁదలప।
నొల్లకయె వారియాతిథ్య ♦ ముల్లమందు।
తియ్యమొప్పంగ విదురుని ♦ తిండితినవె?।
భంజితాఖిలభవకృష్ణ ♦ బాలకృష్ణ॥ ౬౩

గీ. పంచపాండవులకు నీవు ♦ పరమహితుఁడు।
పార్థునకు నీవు సఖుఁడవు ♦ బావమఱఁది।
బాములందొలఁగించి కా ♦ పాడి తీవు।
భంజితాఖిల భవకృష్ణ ♦ బాలకృష్ణ॥ ౬౪

గీ. పాండుహత్యకుఁ గౌరవుల్ ♦ పన్నినట్టి।
బహుకుయుక్తులకెడితివి ♦ ప్రతిహతముల!
భక్తసజ్జనసాధుల ♦ పాలిదేవ।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౬౫

గీ. పాండవులయెడ నీవతి ♦ పక్షపాతి।
పార్థునకుఁ బ్రియసఖుఁడవు ♦ బావవీవు।
సారథివియూచు నిడితివి ♦ శత్రుజయము।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౬౬

—: గీ తా సా ర ము :—

గీ. కౌరవులు బహుసంఖ్యలు ♦ గల్గియున్నఁ।
బార్థునకుఁ దనగురువుల ♦ బంధువులను।
హత్యసేయుటకై చేతు ♦ లాడకున్న।
బరమవిజ్ఞానమిడితివి ♦ బాలకృష్ణ॥ ౬౭

గీ. విధితమగుఁ గర్మముల్ నెర ♦ వేర్చుటయ్యును!
ఫలముఁ గోరకయుండుట ♦ పరమయోగి।
ధర్మమని క్రీడికీవు బో ♦ ధన మొనర్పఁ।
బరమధన్యుఁడ తండాయె ♦ బాలకృష్ణ॥ ౬౮

గీ. మూర్ఖులై గొప్పహరి కాదు ♦ పురహరుండె'
యధికుఁ, డంచును వాదన ♦ లాడు టేల?।
ఈశ్వరుఁడుఁ బరమాత్ముఁడ ♦ వీవటంచుఁ
బార్థునకుఁ జెప్పితివి నీవు ♦ బాలకృష్ణ॥ ౬౯

గీ. భక్తిపథమును, మఱికర్మ ♦ పథముగూడ।
చిట్టచివరకు జ్ఞానిగాఁ ♦ జేయునరుని।
ముక్తుఁడగు మనుఁజుడు జ్ఞాన ♦ యుక్తుఁడైన।
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౨౦

గీ. వలదు సన్న్యాసమటవీని ♦ వాసమైన।
వలదునిజధర్మవర్జన ♦ వల్కలములు।
జటలు ధరియింపవలదు ♦ యిాజ్ఞానమొందఁ
బరమనిస్సంగిగానలె ♦ బాలకృష్ణ॥ ౨౧

గీ. ఇట్టి నిస్సంగియైనవో ♦ నెట్టివాఁడు।
నిక్కముగఁ దాను బ్రహ్మయు ♦ నొక్కఁడనుచు.।
దెలిసికొని చిదానందుఁడై ♦ తేజరిల్లుఁ।
బడయు మోక్షమునప్పుడే ♦ బాలకృష్ణ॥ ౨౨

గీ. ఎదుటి భ్రాత్రాదులం గూల ♦ నేయలేక।
పార్థుఁ డమ్ములధనువునుఁ ♦ బారవేయ।
మమతయును సంశయంబున్ను ♦ మాన్పచీవు।
పార్థునకుఁ దెల్పియిడితివి ♦ బాలకృష్ణ॥ 23

గీ. వేదసారంబు నిటు తెల్ప ♦ విజయుఁడొందె।
కాక యితరుల జ్ఞానులు ♦ లోకులెల్ల।
వేదవిదులౌట కీరితి ♦ వీలుగల్గె।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౨౪

గీ. వేదమను గోవుక్షీరముం ♦ బితికితీవు।
పార్థుఁడేవత్స మొదట త ♦ త్ఫలమునొంద,।

నన్న్యలున్ క్షీరముం ద్రావు ♦ నట్టిలీలఁ।
బరులు గ్రోలెద రద్దాని ♦ బాలకృష్ణ॥ ౭౫

## —: ము క్తి మా ర్గ ము లు :—

గీ. కలవు పెక్కులు ముక్తి మా ♦ ర్గములు మనకు।
జ్ఞానికే జ్ఞానమార్గ; మ ♦ జ్ఞానులైన।
వేనవేగురు తరియించు ♦ విధము చెపుమ।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౭౬

గీ. ఘోరకాననముల జన ♦ దూరుఁడగుచుఁ।
దపము సలుపుట కెల్లర ♦ తరముగాదు।
సలిపినను పెఱవారికి ♦ ఫలముగలదె ?।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౭౭

గీ. సన్న్యసించిన మొదల సం ♦ సారములను।
దుర్గతిం బడఁ ద్రోచిన ♦ దోసమొదవుఁ।
గాన నెల్లరకును నిది ♦ గష్టతరము।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౭౮

గీ. ఆత్మహింసయు హఠయోగ ♦ మభ్యసింపఁ।
గాయతాపముచే బుద్ధి ♦ కలఁతనొందుఁ।
గాన నివ్విధమున నిష్ఠ ♦ గలుగదెపుడు।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౭౯

గీ. కర్మమార్గముఁ ద్రొక్కెడి ♦ కర్మపరులు।
వివిధ కర్మవిధానము ♦ వీసమైనఁ।
దప్పినట్లైన నధిక బా ♦ ధల నొసంగుఁ।
బామరులకిది ముప్పయ్యె ♦ బాలకృష్ణ॥ ౮౦

గీ. భక్తి ఎల్లరకు సాధ్యమగు మార్గ ♦ మెద్దియనిన।
భక్తియొక్కటి దీనినే ♦ భంగినైన।
సలిపినం జాలు, నమ్ముచు ♦ శక్తికొలఁది।
భంజితాఖిల భవకృష్ణ ♦ బాలకృష్ణ॥ ౮౧

గీ. చేతనగుసేవఁ చేసెను ♦ చిట్టియుడుత।
దీనుఁడై మొఱలిడెను మ ♦ త్తేభరాజు।
పడసె నీ కృపఁ దపముచే ♦ బాలధృవుఁడు।
భజన ప్రహ్లాదుఁ డొనరించె ♦ బాలకృష్ణ॥ ౮౨

గీ. మాధవా! నినుఁ బిలచిన ♦ మాత్రముననె।
మానభంగము తొలఁగెను ♦ మానవతికి।
క్షమునిపట్టునుఁ బాసె య ♦ జామిళుండు।
భంజితాఖిల భవకృష్ణ ♦ బాలకృష్ణ॥ ౮౩

గీ. గోపికలు నిను వరియించి ♦ కొనిరి ముక్తి।
పేదబాపడు సిరులొందె ♦ వేడినిన్ను।
సఖుఁడు నీకయి తరియించె ♦ సవ్యసాచి।
భంజితాఖిల భవకృష్ణ ♦ బాలకృష్ణ॥ ౮౪

గీ. చెవుల వినుటయుఁ, గీర్తన, చింతనంబు,।
పాదసేవయుఁ, బూజయు, వందనమును,।

దాస్యముం, దనలోనివే ♦ దనము చెలిమి,।
భక్తి నవవిధ పథములు ♦ బాలకృష్ణ॥ ౮౫

గీ. విన్న, ముక్తుఁడయ్యెం బరీ ♦ క్షిన్నృపుండు,।
నర్తనముఁ గీర్తనముఁజేసె ♦ నారదుండు,।
సంస్మరించి తరించె న ♦ జామిళుండు,।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౮౬

గీ. పాదసేవ యొనర్చెను ♦ పవనసుతుఁడు।
అర్చనముసేసె నిను రావ ♦ ణానుజుండు।
వందనముఁజేసి యక్రూరుఁ ♦ డొందెముక్తి।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౮౭

గీ. ధన్యురాలయ్యెఁ గుబ్జ నీ ♦ దాస్యమునను।
సఖ్యమునఁ దరియించెను ♦ సవ్యసాచి।
భక్తితో మదినెంచెను ♦ పాండుపత్ని।
పరమభక్తులు వీరలు ♦ బాలకృష్ణ॥ ౮౮

గీ. భక్తికీరీతిఁ దొమ్మిది ♦ బాటలుండ।
మనసుపెట్టినచో నొక ♦ మార్గమైనఁ।
గడఁగి త్రొక్కుట నరులకుఁ ♦ గష్టమౌనె ?।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౮౯

గీ. వింతయేమనఁగా, భక్తి ♦ యింతసులభ।
మయ్యునెందరికిది గల్గు ♦ నవనియందు ?।
నూటికొక్కఁడో ♦ లేకున్నఁ గోటికొకఁడో।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౯౦

గీ. రెండుకారణములు భక్తి • కుండవలయు
చిత్తశుద్ధియు, ముందుగాఁ • జేసినట్టి
పుణ్యఫలమునుఁ గూడిన • బుట్టుభక్తి
భంజితాఖిల భవతృష్ణ • బాలకృష్ణ॥ ౯౧

గీ. మనసుపరిపక్వమెప్పుడు • మనకుఁగల్లు?
ఎక్కవలయునుభక్తిలోఁ • బెక్కుమెట్లు
భక్తిలేకుండుకంటెను • ఫలముగోరు
భక్తియుండుటయేమేలు • బాలకృష్ణ॥ ౯౨

గీ. ప్రథమసోపానమౌభక్తి • ఫలముఁగోరు
ఫలమునెంచక సల్పెడి • భక్తిలోన
రకములెన్నియొ గలవయ్య • రంగనాథ
భంజితాఖిల భవతృష్ణ • బాలకృష్ణ॥ ౯౩

గీ. స్వప్రభావము నమ్మను • సామజుండు
చేలమును పాండుపత్ని తాఁ • జేతఁబట్టెఁ
బలుకవైతివిగానీవు • పరములేక
భక్తితోఁగొల్చు వరకును • బాలకృష్ణ॥ ౯౪

గీ. "మ్రొక్కెదము నీకు వేఱొండు • దిక్కులే" ద
టంచుఁబల్కిన మొఱలాల • కించినీవు
భక్తులనుఁ గాచితివివేగ • భక్తసులభ
భంజితాఖిల భవతృష్ణ • బాలకృష్ణ॥ ౯౫

గీ. "మ్రొక్కెదను నాకిల ♦ దిక్కునీవె।
యన్యథాగతిలే" దనున ♦ నన్యభక్తిఁ।
గల్గువాఁడప్పుడేదాటుఁ ♦ గలుషవార్థి।
భంజితాఖిలభవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౯౬

గీ. కరఁగిపోసినఁ గాంచన ♦ కాంతిహెచ్చు
శోకతప్తునికే భక్తి ♦ సుకరమగును।
దుఃఖమెఱుఁగనివానికి ♦ దుస్తరంబు।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౯౭

గీ. దుఃఖముంజేసి నీసేవ ♦ ధ్రువునకబ్బె।
బాములంజేసి ప్రహ్లాదు ♦ భక్తివెలిగె।
బలవిహీనతచే నొందె ♦ భద్రగజము।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౯౮

గీ. విత్తనష్టము శోకవి ♦ పత్తులెల్ల।
ననుభవించంగ నీపాద ♦ మందుభక్తి।
నిలుపఁగల్గితినయ్యయో ♦ నీలవర్ణ।
భంజితాఖిల భవతృష్ణ ♦ బాలకృష్ణ॥ ౯౯

—: పఠన ఫలము :—

గీ. భక్తులెవ్వారుదీనిని ♦ భక్తితోడ।
నాలకింతురు పఠియింతు ♦ రవనియందు।

వారువేఁవేగసంసార ♦ వార్ధిఁదాటి।
పడయుదురు ముక్తినిక్కము ♦ బాలకృష్ణ॥ ౧౦౦

—: అంకితము :—

గీ. భమిడిపాటికుటుంబసం ♦ భవుఁడనైన।
నేను పట్టాభిరాముండ ♦ నీకుభక్తి।
నర్పణముసేయు శతకంబు ♦ నందుకొమ్ము।
భద్రమిదుమయ్య సతతంబు ♦ బాలకృష్ణ॥ ౧౦౧

గద్య :—ఇది శ్రీమదాపస్తంబసూత్ర పవిత్ర
శాండిల్యసగోత్ర వీరాస్వామయాఖ్య పుత్ర
శ్రీకళత్ర భక్తమిత్ర పట్టాభిరామయ్య
విరచితంబగు శ్రీబాలకృష్ణశతకము
సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీసత్యానందప్రెస్, ఇన్నీసుపేట, రాజమహేంద్రవరము.